కేసరి, కే. యన్, 1875-1953

బిల్వ

మదరాసు, 1929

Record no. 443

Kēsari, Kē. Yan, 1875-1953

Bilva

Madarāsu, 1929

Record no. 443

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

కేసరి, కే. యన్, 1875-1953.

బిల్వ : జాతీయ మూలికను గుఱించిన సవిమర్శకవ్యాసము / కే. ఎన్. కేసరిగారిచే విరచితము.- మదరాసు : గృహలక్ష్మి కార్యాలయము, 1929.

46 p. ;19 cm.

Record no. 443

Kēsari, Kē. Yan, 1875-1953.

Bilva : jātīya mūlikanu guṟiñcina savimarśakavyāsamu / Kē. En. Kēsarigāricē viracitamu.- Madarāsu : Gṛhalakṣmi Kāryālayamu, 1929.

46 p. ;19 cm.

Record no. 443

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB Date filming began:

గృహలక్ష్మి గ్రంథమాల: నెం. 2 రు.

శ్రీ

# బిల్వ

జాతీయమూలికను గురించిన సవిమర్శకవ్యాసము

ఆయుర్వేదవైద్యులు; కేసరికుటీరాధిపతులు; తులసిగ్రంథకర్తలు;

“గృహలక్ష్మి” సంపాదకులు నగు,

డాక్టర్. కే. ఎన్. కేసరిగారిచే

విరచితము.

ప్రచురణాలయము.

“గృహలక్ష్మి” కార్యాలయము

పోస్టుబాక్సు 752, ఎగ్మూరు

మదరాసు.



1929

భోధ్రి ముద్రణాలయమున
ముద్రితము.

మూల్యము
రు. 0-8-0. మాత్రమే.

# పీ ఠి క.

ఇంతకు మున్ను 'తులసి' యను జాతీయ మూలికను గూర్చిన సవిమర్శక వ్యాసమును గ్రంథరూపమున వెలయించి ఆంధ్ర మహాజనులకు నివేదించుకొని యున్నాను. ఇప్పుడు 'బిల్వము'ను గూర్చిన గ్రంథమును వెల్వరించి నాసోదర దేశీయుల కరకమలములకు వినీతభావముతో నందించుచున్నాను.

తులసి వైష్ణవ సాంప్రదాయము ననుసరించు వారికి ఎట్లు పరమ పూజ్యమై వెల్లయుచున్నదో బిల్వము శైవ సాంప్రదాయము ననుసరించు వారికి అట్లు పరమ పూజ్యమై క్రాలుచున్నది. బిల్వమునకుఁజెందిన మత సాంప్రదాయము, పురాణవివరము గ్రహించి దాని ఓషధీగుణమును తెలిసికొనుటకు ఈ గ్రంథము కొంచముగానైన తోడ్పడెనేని నా ప్రయాస సఫలమగును. ఈ గ్రంథమువలని లాభము విద్యాప్రియులగు నాంధ్ర మహాజనులు యథోచితముగఁ బొందెదరుగాక!

విశేష విద్యాగంధములేని స్త్రీలకు, బాలబాలికలకు ఆర్యమత సాంప్రదాయములు, ఓషధీజ్ఞానము, ఉత్తమ వ్యక్తుల జీవితములు బోధించుటకు అనువైన గ్రంథములను వెలయించి ఆంధ్రసేవ చేయ గృహలక్ష్మి గ్రంథమాలను స్థాపించినాను.

ఆగ్రంథమాలలో తులసి ప్రథమకుసుమము. ప్రస్తుతము వెలువడినబిల్వము ద్వితీయపుష్పము. ఇట్టివియేయగు ఉత్తమ గ్రంథములను ప్రచురించి ఆంధ్రభాషాసేవ చేయ సమకట్టియున్న నాయుద్యమమునకు ఉదారాశయులగు ఆంధ్రమహాజనులు పోషణ ప్రోత్సాహములు కల్గింతురుగాక!

కేసరీ కుటీరము.
మదరాసు.

ఇట్లు
డాక్టరు. కే. ఎన్. కేసరి.

మనవి.

బిల్వమును గూర్చి విశేషపరిశోధనముచేసి ప్రస్తుత మీమాత్రము సామగ్రిని సేకరించి లోకమునకర్పింప గలిగినాను. ఇంతకంటె దీనినిగూర్చి విశేషములు ఎఱిగినవారు దయయుంచి నాకు తెలిపినచో రెండవ ముద్రణమున ఆవిషయముల నిందు వందన పూర్వకముగా పొందు పఱుప గలను.

ఇట్లు
గ్రంథకర్త.

# బిల్వ.

బిల్వవృక్షములు భారత దేశమందలి అన్ని ప్రాంత ములలోనను గలవు. బిల్వమన తెలుగు భాషలో మారేడు అని యర్థము. తులసి దళమన మహావిష్ణువున కత్యంతప్రీతి; అట్లులే బిల్వదళమన శివున కత్యంతానురాగము. ఆకారణము చేతనే మనదేశమందలి చాల శివాలయములయందు బిల్వ వృక్షములు నాటబడియుండును.

తులసి మొక్కవలె చిన్న 'కోటల' యందుగాని తొట్ల యందుగాని మారేడును పెంచుటకు వీలులేదు. మారేడు మానుగల మహావృక్షముగ పెరిగిపోవును. వైరాగ్యము, మహాత్యాగము, నిరాడంబరజీవనము మున్నగువాటికి నిలయ మగు మహాశివునియొక్క ప్రియమైన వృక్షమగుట చేతనో ఆయన సంతతివారికి భూత ప్రేతాదిగ్రహములయొక్క నాయ కత్వము కలదనియో,—యిట్టిదేదియో కారణముగనుండుటచే కొంతమంది బిల్వవృక్షమును యింటిదొడ్డిలో పెంచుట కంగీక రింపరు. కాని వైద్యులు, పట్టుదలగ మహాశివుని భక్తులును మాత్రము యీ బిల్వమును తమతోటలయందును దొడ్ల యందును పెంచుచుందురు. పాపభూయిష్టమగు జీవితమును

గడపు యెంతటిదుష్టుడైనను బిల్వవృక్షము క్రింద మరణించునెడ శివసాన్నిధ్యము సిద్ధించునని శైవులు నమ్మెదరు. మరణసమయములయందు బిల్వదళతీర్థముతో స్నానము చేయుటవలన కొంచముసేపు అస్వాస్థ్యము నశింపగలదని శివమతస్థుల యభిప్రాయము. అట్టులే ఆ యుదకమును నోటియందుపోసి ప్రాణముపోవుచున్నదని శివున కెరుకపరచుటకో యనునట్లు 'శివశివా' యని చుట్టునున్నవారు రెండుమూడుమారులు కేకలువేయుదురు.

# బిల్వ ప్రభావము.

బిల్వప్రాశస్త్యమును చాటగల కథలు హిందూ గ్రంథముల యందెన్నింటియందో కలవు. అందు ముఖ్యమైనదొక్కగాథయున్నది. దానివలన బిల్వదళము మనోరథమీడేర్పగలదనియు, శివున కత్యంత ప్రియతమమైన వస్తువనియు తెలియుచున్నది: ఆ కథ క్లుప్తముగ నిట పొందుపఱతుము.

సర్వాంగసుందరి, సర్వలక్షణ శోభిత, మనుకుమారి ప్రసూతిని, దక్షప్రజాపతి ప్రేమించి వివాహమాడెను. యువదంపతులత్యంతానురాగము గలిగి మెలంగుచు పదునార్వురు పుత్రికల గనిరి. తన బిడ్డలలో కడపటిదియగు తనప్రేమంపు సతి విరోధిపక్షమునకు జెందిన శివుని హృదయాన వరియించెను. ఈ విషయమునెరింగిన దక్షప్రజాపతి సతియొక్క కోర్కె తీర్ప తప్పినదికాదు. శుభముహూర్తమున కళ్యాణమంటపము యెదుట శివునకు సతినొసంగి దక్షప్రజాపతి తన హృదయవాంఛకు విరుద్ధముగ వివాహముచేయవలసివచ్చెను. వివాహానంతరము శివుడు తన యర్థాంగిని వెంటనిడుకొని వెడలిపోయెను.

కొన్నినాళ్లైన పిమ్మట దక్షుడు యజ్ఞము చేయతలం
పడెను. దేశదేశములయందలి రారాజులు, మహామేధా సంప
న్నులు, మునిపుంగవులు మున్నగువారందరును రావింపబడిరి.
సభికులందరును విశాలముగ వేయబడియున్న యాగశాల
యందు సుఖాసీనులై యుండిరి. యాగశాలయంతయు కలకల
లాడుచుండెను. సర్వాలంకార శోభితుడైన దక్షుడు ధగధగ
మని ప్రకాశించు దుస్తులతో ప్రవేశించెను. అంతవరకును
కూరుచుండినవారందరును దక్షుని రాకగాంచి లేచి గౌరవ సంప్ర
దాయానుసారముగ ఆతనిని గౌరవించిరి. ఆ సమయాన
బ్రహ్మయు, శివుడును మాత్రము లేవలేదు. గురువగు బ్రహ్మకు
ప్రణమిల్లి దక్షు డుచితాసనాసీనుడయ్యెను. తన్ను గాంచియు
శివుడించు కేనియు కదలక మెదలకయుండుటనుగాంచి దక్షు
డాగ్రహాయత్తచిత్తుడై అవమానింపబడినట్లుగ హృదయమున
తలంచెను. కొంతవరకతడట్లుండెగాని హృదయస్థమైయున్న
కోపమాగలేదు. క్రోధారుణ నేత్రుడైన దక్షుడు శివుని నిందిం
చెను. కొంత వాగ్వాదానంతరము శివుడు యాగశాల వీడి
గృహాభిముఖుడాయెను.

ఆ సమయమున యాగశాలయందులేని సతి కీసంగతి
తెలియగనే బిరబిర శివునికడకేగి పెద్దవాడగు తన తండ్రి నగౌ
రవపరచు టెంతమాత్రమును సమంజసముగ లేదని శివుని



యెడ నామె తప్పుబట్టెను. అంత నాతడు తాను ఏవిధమున
గాని మామగారి నగౌరవ పరుపలేదనియు బాహ్యాపటా
టోపములన తన కెంతమాత్రమును యిష్టములేని కారణమున
చేయవలసిన గౌరవమంతయు హృదయమందే చేసియుండె
ననియు బాహ్యాడంబరముల వాంఛించు దక్షు డీ విషయమును
గమనింపలేకుండుట తన నేర మెంతమాత్రమును కాజాలదనియు
శివుడు సతిని సమాధానపరుప దొడగెను గాని సతి అందుల
కంగీకరింపదాయెను. యాగము సక్రమ విధమున సాగిపోయి
నది.

దక్షుని హృదయ మందుదయించిన క్రోధానలజ్వాలలు
యింకను తగ్గలేదు. ఎప్పుడు సమయమాసన్నమగునా
యెప్పుడు మనము శివుని పరిభవింతుమా యని ఆతని హృద
యము యెదురుచూచుచుండెను. మరల నింకొకయాగము
గావింప దక్షుడు తలపడెను. ఆ యాగమునకు బ్రహ్మాండ
మగు ప్రయత్నములు గావింపబడెను. దేశదేశములయందలి
వారలకును ఆహ్వానము లంపబడెను.

యాగము ప్రారంభింపబడెను. శివునకు మాత్ర
మాహ్వానమురాదాయెను. ఈయాగ సమయమునకు అక్క
లందరును వత్తురుగాన వారినందరను చూచుట కిదియే సమయ
మని సతి కుతూహలాయత్తచిత్త యగుచుండెను. కాని

యాహ్వానము రాలేదు; పిలువని పేరంటమునకు పోరాదని శివుడూరకొనియెను. సతి హృదయ మామాట నంగీకరింప జాలదు. ఎట్టులైనను వెళ్లవలెనని సతి పట్టుబట్టెను. భార్య యొక్క పట్టుదలకు హృదయమున విచారించి శివుడు వలయు పరివారము నొసంగి సతిని ప్రయాణముచేసి యాగమున కంపెను.

యాగశాల అత్యంత రామణీయకముగ నలంకరింపబడి యుండెను. దక్షు డుచితాసనమున ఆసీనుడై యుండి వచ్చిన వారల నుచితరీతిని గౌరవించుచుండెను. సతి ఆనందముప్పొంగ యాగశాల జొచ్చి తండ్రికి నమస్కరించి "నాన్నా!" అని ప్రియమార బిలచెను. దక్షు డుగ్రుడాయెను. తన కొమరితను అవమానపరచిన, శివుడును పరిభవింపబడినట్లగునని తలచిన దక్షుడు కనులెర్రజేసి ఆమెనా శాలనుండి కొని పోవలసినదిగ సేవకుల కాన యొసగెను.

పాపము అమాయికయగు సతి కేమియు తోచదా యెను. దుఃఖము ఆదియందు హృదిని కలంచివైచినను ఒకే క్షణములో నదియంతయు మాయమయ్యెను. ప్రజ్వలిత నేత్రయైన సతి పరాభవమును భరింపలేక పోయెను. ఉగ్ర స్వరూపిణియై హృదయాగ్నికణముల రగుల జేసి మరుక్షణమున భస్మమాయెను.



అర్ధాంగియొక్క విషాదాంతము శివుని చెవులకు శోకెను. మొదట ఉగ్రుడాయెను కాని మరల తన యర్ధాంగి జ్ఞప్తికిరాగనే కనుల నీరునిండెను. అతడు పిచ్చివానివలె భూతలమంతటను గ్రుమ్మరెను. కడకొక బిల్వవృక్షచ్ఛాయ నించుక సేపు కూరుచుండి తరుశాఖలమీదికి దృష్టిని పోనిచ్చెను. పచ్చనై కనులపండువొనరించుచున్న ఆవృక్ష మాతనికి తన ప్రేమంపు సతివలె కన్పట్టెను. 'సతీ సతీ'యని పలవించెను. వృక్షాగ్రమున్ననున్న బిల్వఫలములు సతీవక్షోజ ములవలె నేత్రములకు కానుపించెను. పత్రములామె నేత్రము లను జ్ఞప్తికి దెచ్చుచుండెను. ఆ వృక్షచ్ఛాయనే ఆతడు చాలకాలము గడపెను.

బిల్వ పత్రములు ఫలములు పుష్పములు తిలకించుచుం డిన శివునకు సతిమరింత దగ్గరయైనటులుగ కానుపించుచుండెను. కొంతవడికి సతియే ఆ బిల్వ వృక్షాకృతిని దాల్చియున్నదన్న టులు మరల తలంచి ఆమె పూర్వాకృతిని జ్ఞప్తికిదెచ్చుకొని అశ్రువులను రాల్చెను. కడకు తన భార్యయెడగల మక్కు వయే తనకీ భ్రమను కలిగించెనని తెలిసికొనియెను.

ఇటులుండ హిమవత్పుత్రి పార్వతి తనహృదయాన శివుని ప్రేమించెను. ఎట్టులైనను ఆ దివ్య తేజోమయరాశినే వివాహ మాడవలయునని పార్వతి కృతనిశ్చయయాయెను. అథో

ముఖియై కొంతకాలము ధూప మాఘ్రాణించుచు తపమాచరించెను; కొన్ని దీర్ఘవత్సరములు వివర్ణపత్రముల నారగించుచు కాలముగడపెను; ప్రతివత్సరమును మాఘ మాసములయందు మంచువలె చల్లగనుండి వణకించు జలాశయములయందు స్నానమాచరించుచు వచ్చెను. వైశాఖమాసమున పంచాగ్నుల మధ్యనిలచి ఘోరతప మాచరించెను. ఇదియంతయును ఆ మహాశివుని వివాహమాడుటకే పార్వతి యొనరించెను.

కాలము శాంతయుతముగ వెళ్లుటయన కొందరంగీకరింపరు. కొలది కలహములు, పోరాటములు ఉండవలయుననియు వారి మతము. ఇరువుర మధ్య కయ్యమిడి వారలు వాదోపవాదములను బలాబలములను ప్రదర్శింపుచుండ మధ్యనిలచి చూచుచు ఆనందించుటయే వారిపని. ఈ వింతనడవడిక గల వారికి నాయకత్వము వహించుటకు నారదుడుతప్ప వేరెవ్వరు నర్హులు కారనుట నిర్వివాదాంశము. పార్వతి గావించుచుండిన ఘోరతపముల దిలకించి యిదియే సమయమని తన మాయల నల్లుకొనుచు నారదుడు పార్వతితండ్రి హిమవంతుని కడకేగెను. హిమవంతునితో కొంతవరకు లోకాభిరామాయణమును సాగించి కడగు నారదుడు పార్వతి వివాహవిషయమగు సంభాషణను గొనివచ్చెను. తంత్రముల బన్నుటయందు కడుంగడు నేర్పరియగు నారదుడు సరియగు సమయము కనిపెట్టి



పార్వతి కన్నివిషయముల తగినవరుడు విష్ణువేయనియు ఆతని నల్లునిగా బడయుటయే శ్రేయస్కరమనియు తెలిపెను. లోని మర్మము నెరుగని హిమవంతుడు అట్టులే విష్ణువునకు తనపుత్రిక నిచ్చి వివాహము గావింతు ననియెను.

తండ్రి యభిప్రాయ మెట్టులో పార్వతికి తెలియవచ్చెను. పార్వతి తనసాంసారిక సమస్యయందు తనకెంతటి హక్కును లేకుండ గావింపబడుట గాంచి చాల దుఃఖించెను. హృదయపూర్వకముగ వరించిన ధ్యాతనినిదప్ప వేరెవ్వరినిగాని వరింపలేనని ఆమె నిశ్చయించుకొనెను. ఈ విషయమున తండ్రిని కూడ ధిక్కరింపవచ్చుననియు అందున యెట్టినష్టముగాని కలుగదనియుకూడ పార్వతి యనుకొనియెను. ఏనాడీ యభిప్రాయముదయించెనో ఆనాడే పార్వతి తలిదండ్రుల గృహము వీడినది. శ్రమయని దుఃఖింపక గహనములబట్టినది. గృహమునకు చాల దూరమేగిన యనంతరమొక విశాలప్రదేశమున యిసుకతో శివలింగము నొకదానిని గావించినది; పార్వతి ఆ శివలింగమును మనసార, బిల్వపత్రములచే పూజింప నారంభించినది. అందులకు ఫలితముగ శివుని మెప్పులనంది ఆయన యర్థాంగియైనది పార్వతి. తన్మూలమున శివునకు సతీ వియోగము వలన గలిగిన అశాంతియు, పార్వతి మనోరథమును యీడేరినవి. ఇందులకు కారణము బిల్వమేయని చెప్పబడియున్నది. కాన పౌరాణికముగ బిల్వమునకు పవిత్రత యొనగూడినది.

శివారాధనలయందు బిల్వపత్రముల నెవ్వ రుపయోగింపరో వారలు యేడు తరములవరకు నరక మనుభవింతురని శివభక్తు లనియెదరు.

### చరిత ప్రసిద్ధి.

బిల్వము పౌరాణిక గాథలందేగాక హిందూదేశచారిత్రమందుకూడ కొంతవరకు చేర్కొనబడియున్నది. పటాన్ జాగీరుదారుడైన దామోజీత్రోరాట్ అను నాతడు, క్లిష్ట పరిస్థితులనడుమ నిరుకుకొనియున్న బాలాజీ విశ్వనాథుడను మొదటి పీష్వాకు సహాయపడెదనని బిల్వవృక్షము క్రింద ప్రమాణ మొనరించి మాటయొసగియు, కడకు ద్రోహియై పీష్వాను మోసగించెను. అందుమీద బాలాజీ విశ్వనాథుడాగ్రహాయత్తచిత్తుడై దామోజీని నిందింపగ "బిల్వవృక్షము క్రింద మాట యిచ్చిననేమి? అది యేమిచేయగలదు? అది కదలలేని యొక వృక్షమేగదా" యని హేళనగ ననియెను. ఇట్లు బిల్వమును నిరశించినందులకే ఆతని గౌరవమునకు తీరని కళంక మొనగూడినదని మహారాష్ట్ర చరిత్రయందా కాలపు గ్రంథకర్తలు వ్రాసియున్నారు.

## బిల్వము, అందలి రకములు.

బిల్వవృక్షములో అనేక రకములున్నవి. భూసారము పునాదిగా యీ రకములలో కొన్ని యేర్పడినవి. ఒక ప్రాంతమందు పెద్ద ఫలములుగాయు బిల్వ విత్తనమునుదెచ్చి యింకొక ప్రాంతమున నాటుటచే భూసారమందుగల భేదముచేత మొదటి స్థానమునందు గాచినంతటి పెద్దఫలము లీ రెండవ స్థలమున కాయక పోవచ్చును. ఇదియెగాక స్వతహా ఆ జాతిలోననే కొన్ని రకములకాయలు కాయుటగలదు. చిన్న జాతి ఫలములు కాయు మారేడును కాకిమారేడందురు. ఈ రకముచెట్లు ఆంధ్రదేశమున విపరీతముగనున్నవి. పెద్ద పెద్ద ఫలములుగాయు రకములు కలకత్తా, గయాప్రాంతములయందెక్కువగ కాననగును. ఈ ఫలములు బొప్పరపనాసలంతంతయుండును. తరువాత చిట్టిమారేడను రకమొకటి కలదు. ఇది దేశమందన్ని ప్రాంతములలోనను గలదు. ఆంధ్రదేశమందీ రకము మారేడు యెక్కువగ గంజాముజిల్లా యందున్నది.

ఈ బిల్వమునకు ఆంధ్రమున మారేడందురని చెప్పితిమి. దీనికే సంస్కృతమున శాండిల్య, శైలూష, మాలూర, శ్రీఫల,

కపేతన, మహాకపిత్థ, అతి మంగల్యా, మయూర, గోహరీతకీ, శల్యా, మహాఫల, హృద్యగంధి, రుభూక, శలాటు, కర్కటాహ్వా, శైలపత్ర, శివేష్ఠ, పత్రశ్రేష్ఠ, త్రిపత్ర, గన్ధపత్ర, లక్ష్మీఫల, గన్ధఫల, వదారుహా, దురారోహా, త్రిశాఖపత్ర, త్రిశిఖ, నీలిమల్లికా, శివద్రుమ, అసితానన, సదాఫల, పీతఫల, సత్యకర్మా, కంటకీ, గన్ధగర్భ మొదలగు నామములు కలవు.

ఈ సంస్కృత నామము లెటులు వచ్చినవో కొంతవరకు తెలుపవలసి యున్నది.

బిల్వమూలము దశమూలములలో చేరియున్న దాటచే మహామూలమన్న పేరు దీనికి గలదు. అంతియెగాక *పంచ మహామూలములలోకూడ దీనిపేరు గలదు.

మారేడు ఆకునకు మూడుదళము లుండుటచే త్రిపత్ర, త్రిశాఖ, త్రిశిఖ యను సంస్కృత నామములు వచ్చినవి. మారేడు ఫలము పెద్ద వెలగపండువలె నుండుటచేత మహాకపిత్థ మని పేరుగలదు. పత్రము, గుజురు సువాసన గలిగించుచుండుటచే గన్ధపత్ర, గన్ధగర్భ యను నామములు వచ్చినవి.

మారేడు వెలగజాతిలో చేరిన వృక్షము. అందువలననే పత్రముల ఆకృతిలోనను మానుయొక్క బెరడు ఉండు విధములోనను చాలపోలికగలదు.

---

*పంచ మహామూలములు—మారేడు, తక్కలి, గుమ్మడి, కలిగట్టు, దుండిలము.

# సాధరణోప యోగములు.



మారేడు దళములు పూజ లొనరించుట కుపయోగపడునని యిదివరలో చేర్కొనియుంటిమి. చిన్నజాతి మారేడు కాయలు పొడుము భద్రపరచు బుఱ్ఱలక్రింద నుపయోగింపబడుచున్నవి. ఇటీవల పొడుము పెట్టెలు మున్నగునవి వచ్చినవి కాని పూర్వకాలమందు పొడుము నుపయోగించు వారందరును యీ మారేడు బుఱ్ఱలనే యుపయోగించుచుండెడివారు. మారేడు బుఱ్ఱలయందు పొడుము వేయుటవలన పొడుము ఘాటు పోకుండుటయేగాక పరిమళము వచ్చునని పొడుము బీల్చువారనుచుండుట నెల్ల రెరిగియేయుందురు. ఈ పొడుము బుఱ్ఱలను తయారుచేయుటకు బొబ్బిలి, తుని పట్టణములు ప్రఖ్యాతిగడించియున్నవి. తునిలో తయారుచేయబడిన పొడిబుఱ్ఱలపై గల నగిషీపని యెంతయు ప్రశంసార్హమై యుండుటచే వాటిని ఉత్తర హిందూదేశమందలి ప్రదర్శనాలయములయందుకూడ నుంపబడినవని ప్రతీతికలదు.

ఉత్తర హిందూదేశమందు గల బిల్వఫలము చాల పెద్దదై మాధుర్యయుతమై యుండుటచేత ఆ ప్రాంతీయులు

యీ ఫలము నెక్కువగ నుపయోగింతురు. మారేడుఫలములతో హల్వాలు తయారుచేయుదురు; షర్బత్తులు చేసికొనెదరు; ఒక విధమగు మిఠాయికూడ ఆ రాష్ట్రీయులు చేసెదరు. ఇవి యన్నియు మిఠాయి అంగళ్లయందు యెల్లవేళలను దొరకుచుండును. బిల్వ సంబంధమగు దేని నారగించినను, శరీరమందుగల అపరిమితమగు ఉష్ణమును తగ్గించును. ఈ విషయమున మారేడునకు మించిన ఓషధి మరియొకటిలేదు.

# మారేడు—వైద్యులు.

ఆదియందు మారేడుయొక్క విలువను హిందువులు కనిపెట్టిరి. అందువలననే ఆయుర్వేద మందీయోషధీ రత్నమున కంతటి ప్రాముఖ్యత యొసగబడియున్నది. ఇటీవలనే పాశ్చాత్య వైద్యులుకూడ మారేడునందుగల రోగ నాశకశక్తిని కనుగొని బ్రిటిషు ఇండియన్ ఫార్మకోపియాలో చేర్చుకొనిరి. యూనానీ వైద్యులుకూడ బిల్వముయొక్క విలువ నెరింగి తరుచు రోగ చికిత్సల కుపయోగించుచున్నారు.

ఆయుర్వేద యూనానీ వైద్యులు బిల్వముయొక్క వేరు, బెరడు, దళము, ఫలము, కాయ, పిందె, పుష్పము—వీటినన్నింటి నుపయోగించుచుందురు. పాశ్చాత్యులు బిల్వఫలములనుమాత్ర ముపయోగించు చున్నారు. మారేడుముండ్లు యింటి చూరునకు వ్రేలాడ గట్టబడినచో భూతప్రేత పిశాచాదు లెవ్వియు దరికి రాజాలవని భూతవైద్యుల నమ్మకము. విరివిగ అన్నిశాఖలయందును బిల్వ ముపయోగింపబడుచున్నది.

మారేడుగుణము.

మారేడు యించుమించుగ మానవ శరీరమునకువచ్చు సర్వరోగములను నివారించు ననవచ్చును. ఈ యోషధి వాతము, కఫము, చర్ది, శ్వాస, కాసము, హిక్కా, క్షయ, జ్వరము, అతిసారము, శూల మున్నగువాటిని శమింపజేయ గలదని ఆయుర్వేదమందు చెప్పబడియున్నది. జఠరాగ్నిని కలుగజేసి పైత్యము వలయునంతవరకు పెంచును; ఆమమును సక్రమముగ తయారుచేయును; మలమును కట్టును; రుచిని బుట్టించును.

మారేడు (లేత) కాయ కొంచము వగరుగనుండును. ఇది కఫము, వాతము, ఆమదోషము, శూల, గ్రహణి, వీటిని శమింపజేయును.

మారేడు(ముదిరిన) కాయ వగరుగ నుండును. ఇది ముఖ్యముగ పైత్యమును హెచ్చుచేయును.

మారేడు ఫలము తీపి, వగరు, వాసన గలిగియుండును. ఇది త్రిదోషములను హెచ్చుచేయును; మలమును కట్టును; జఠరాగ్నిని మందపఱచును; శుక్లమును వృద్ధిచేయును; శరీరమందుండు దుర్గంధ వాయువులను బయటికి వెడలించును; అపారమగు తృష్ణను కలిగించును.



మారేడు దళము చేదుగను కొలది మధురముగ నుండును. ఇది వాతము, కఫము, ఆమశూల వీటిని నశింపజేయును; రుచినిపుట్టించును.

మారేడు పుష్పము అతిసారము, దప్పి, వాంతి వీటిని పోగొట్టును.

ఇతర జాతులయందు ఫలములు పక్వమైనమీదనే గుణమును గలిగియుండును గాని మారేడునందు మాత్ర మట్లుగాక లేతపిందె మొదలుకొని ఫలము వరకును గుణవంతమై యొప్పుచుండును.

ఈసందర్భముననే సుశ్రుత సంహితలో

"ఫలేషు పరిపక్వం యత్ గుణవత్తదుదాహృతి
బిల్వాదన్యత్ర విజ్ఞేయ మామన్తద్ధి గుణోత్తరం."

అని చెప్పబడి యున్నది.

"దాడిమ, బిల్వశివాదీనాం ఫలం
శుష్కం గుణాధికం"

(దాడిమ, బిల్వ, ఉసిరిక, కరక్కాయ మున్నగు ఫలములు యెండినవెనుకనే గుణమధికముగనుండును) అని తెలుపు శ్లోకార్థానుసారము మారేడు గుజురు యెండబెట్టి ఔషధములయందుపయోగించునెడ గుణ మెక్కువయుండును.

మారేడు ఆకులకషాయము ఉబ్బసము వమనము నణచును. ఈ యాకులే కండ్లకు కట్టునెడ కండ్ల యెరుపులు నివారింపబడును.

జ్వరములకును శైత్యవ్యాధులకును మారేడు ఆకు అంకుశమువంటిదని చెప్పవచ్చును.

మారేడు ఫలమందు నేత్రరోగములను మాన్పగలుగు గుణమధికముగ నున్నది.

మారేడు పుష్పములద్రావకము (అరఖు) కొన్ని విషములకు విరుగుడుగను కలరాను మాన్పు దివ్యౌషధముగను పని జేయును.

మారేడువేరుయొక్క గంధము విషముల హరించును. ఈ వేరు కషాయము గుండెదడను తగ్గింపగలదు; మలబద్ధకమును నివారించును.

దోరమారేడు గుజ్జు యొక్క కషాయము అతిసారము, గ్రహణి మున్నగువాటిని నివారించుటకు దివ్యౌషధము.

మారేడు గుజ్జుతో తయారుచేయబడిన షరబత్ (పానకము) మధురమై, పరిమళసంయుతమై సేవించువారి దేహమందుండు యెక్కుడు ఉష్ణమునుతగ్గించి శాంతినొసంగును. దోర మారేడు ఫలమునుండి తయారు చేయబడిన ద్రావకము చాల గుణమును గలిగియున్నదని రాయబహద్దర్ డాక్టర్ కన్యాలాల్ గారు వ్రాసియున్నారు. మారేడు ఫలములోని గుజ్జుతో తయారుచేయబడిన చూర్ణమును, అవలేహ్యమును (Semi-liquid Extract) దీర్ఘ అతిసారమును, గ్రహణిరోగములను మాన్పుటలో చాల ఉపకరించుచుండుటవలన పాశ్చాత్యులు వీటిని విరివిగా నుపయోగించుచున్నారు. దోరపండు గుజ్జును అతిస్వార జ్వరములకును, చెట్టుమూలము యొక్క బెరడు మూలరోగములకును వాడుట ప్రశస్తమని చరకాచార్యుడు చెప్పియున్నాడు. ముదురకాయగుజ్జు అతిసారరోగమును పైత్యరక్తమును పోగొట్టగలదని సుశ్రుతాచార్యుని యభిప్రాయమై యున్నది. చక్రదత్తుడు బిల్వ వృక్షమందలి ప్రతి భాగమును ఉపయోగించుచుండెడివాడని స్పష్టముగ తెలియుచున్నది. నోటియందలి దుర్గంధహరమునకు బిల్వదళములును, కర్ణరోగములకు కాయగుజ్జును వాడవలయునని చక్రదత్తుడు చెప్పియున్నాడు.

# బిల్వాది చూర్ణములు.



గ్రహాణి రోగమునకు:—

వర్చస్యామే సప్రవాహేపి జేద్వా దాడిమాంబునా ।
బిడేనలవణం పిష్టం బిల్వచిత్రక నాగరం ।
సామేకఫాని లేకోష్ఠ రుష్కరేణోష్ణ వారిణా ॥

గ్రహాణి రోగికి అజీర్ణము ప్రవాహికోపద్రవము వీని తోడ మలము వెడలిన బిడాలవణమును దానిమ్మరసములో కలిపి పానము చేయించవలయును. మఱియు వాతకఫములు ఆమముతోగూడి కోష్ఠమునందు నొప్పిని గలుగజేయుచుండిన మారేడు, చిత్రమూలము, శొంఠి వీటిని సమభాగములుగ గ్రహించి కొంచెముష్ణముగనుండు ఉదకములో కలిపి పానముచేయించవలయును.

—అష్టాంగ హృదయము.

వర్ధ్మమందు (అండవృద్ధి):—

మూలంబిల్వ కపిత్థయోరరలు కస్యాగ్నేర్బృహత్యోర్ద్వయోః
శ్యామాపూతికరంజ శిగ్రుకతరోర్వ్యాశ్వాప ధారుష్కరం ।
కృష్ణాగ్రంధిక వేల్ల పంచలవణక్షారాజ మోదాన్వితం ।
పీతం కాంజిక కోష్ణతోయమధితై శ్చూర్ణీకృతం వర్ధ్మజిత్ ॥



మారేడువేరు, వెలగవేరు, పెద్దమ్రానువేరు, చిత్రమూలము, ములక, పెద్దములక, పసుపు, అడవిక్రానుగు, మునగ, సొంటి, నల్లజీడివిత్తులు, పిప్పళ్లు, గ్రంధితగరము, వాయువిడంగములు, లవణపంచకము, అజామోదము వీనిని సమముగా చూర్ణముగావించి గంజి వేడినీరు వీనిలోకలిపి త్రావిన వర్ధ్మ (అండవృద్ధి) రోగము నశించును.

—గదనిగ్రహం.

వాతవ్యాధియందు:—

బిల్వైలాపటు హేమచవ్యహపుషా ద్రాక్షాకణాదాడిమం। మూలం పౌష్కరమక్షపాక్యమరిచం శుంఠీ యవానీవచా। కర్షోచ్చరేంద్ర యవాహ్వవే తసత్పుటీత్వక్త్రిడీకాగ్నికం। సైవ్యంపత్రమాజియుగ్మరుచకం క్షుద్రాముబ్ధా త్రీఫలం। పాఠాధాన్యయనానదీప్యకకణా మూలందలం బాష్పికా॥ ముస్తా కర్షసమైశ్చతుష్పలయుతైః క్షౌద్రస్యజీర్ణస్యవై। దత్వాగుగ్గులు మత్రచాష్ట పలికంకృత్వావటా న్భక్షయేత్। తేజస్థావినిహంతి వాతకఫజాన్ వ్యాధీన శేషానపి॥

మారేడు, ఏలకులు, సైంధవలవణము, నాగకేసరములు, చవ్యము, ప్రబ్బి, ద్రాక్ష, పిప్పళ్లు, దానిమ్మ, పుష్కరమూలము, సౌవర్చలవణము, బిడాలవణము, మిరియాలు, సొంఠి, ఓమము, వస, కర్పూరములు, కొడిసపాలవిత్తులు,

అమ్లవేతసము, చిన్నఏలకులు, లవంగపుపట్ట, చింతపండు, చిత్రమూలము, వేపఆకు, అజామోదము, వాయింట, సాముద్రలవణము, వాకుడు, కురువేరు, ఉసిరికపండ్లు, విషబొద్ది, ధనియాలు, దూలగొండి, జీలకర్ర, మోడి, తాలిసపత్రి, కజ్ర ఇంగువ, తుంగముస్తెలు వీనిని కర్ష ప్రమాణములుగ చూర్ణము గావించి 4 పలములు తేనె 8 పలముల గుగ్గిలము కలిపి వటకములు గావించి బలానుసారముగ సేవించిన వాతరోగములు కఫరోగములు నశించును.

—గదనిగ్రహం.

## గ్రహణికి, బిల్వాది చూర్ణము:—

మారేడుపండుగుజురు, తుంగముస్తెలు, ఆరెపువ్వు, విషబొద్ది శొంఠి, బూరుగబంక యీవస్తువులను సమభాగములుగ తీసికొని చక్కగ చూర్ణించి తడవకు పదిమొదలు యిరువై గురిగింజల ప్రమాణమును బెల్లము మజ్జిగ అనుపానముతో నిచ్చిన నడుము నొప్పి, కడుపునొప్పితోకూడుకొనియున్న గ్రహణి రోగములను కుదుర్చునని చక్రదత్తుడు చెప్పియున్నాడు.

డాక్టరు మోహిదీన్ షెరిఫ్ ఖాన్ బహదూరుగారు మారేడు ఫలమునకుగల గుణాతిశయములను గురించి తమ యనుభవమును యీక్రింది విధమున వ్రాసిరి:—



“ఆమవిరేచనములకు, అతిసారములకు, నోటితెల్లపూతకు, పురాణజ్వరములకు, చర్మ వ్యాధులకు మారేడుపండు అత్యద్భుతముగ పనిచేసినది. నేను సాధారణముగ గుజురు చూర్ణమును, షరబత్తును వాడుచుండెడివాడను. బాగుగా పండిన పండుతోచేయబడిన షరబత్తు చక్కగ పని చేయును. చూర్ణమునకు ముదిరినకాయ శ్రేష్ఠము. దీర్ఘ వ్యాధులకు చూర్ణమును వాడిన నమ్మకముగ పనిచేయును. కఠినమైన గ్రహణి రోగమునకు చూర్ణపు మోతాదును యెక్కువ వాడవలసి యుండును. చూర్ణము గ్రహణికి వాడినప్పుడు మలము నుండివెడలు రక్తము వెంటనేతగ్గి మలము ధారాళముగ పోవుచుండుటయే దీని మంచిగుణమునకు గుర్తు. చూర్ణముచే వెంటనే విరేచనములు నిలువకపోయినను మలమునందు మంచి మార్పు గలుగును. విరేచనములసంఖ్య తగ్గించుటకు బిల్వ చూర్ణమునందు నల్లమందుగాని, గంజాయిని గాని చేర్చియిచ్చిన గుణమిచ్చును. మారేడు చూర్ణము షరబత్తు యీరెండును విడువని జ్వరములకు, జ్వరలక్షణములకు, దుర్బలతవల్ల కలుగు జ్వరములకు, విషమజ్వరములకు, మంచిఔషధ

ములు. ఈ ఔషధములవల్ల జ్వరవేడిమి వింతగదగ్గి పోవును. షరబత్తుకంటె చూర్ణమే జబ్బులకు మంచి మేలు చేయును.

డాక్టరు కోమన్‌గారు మద్రాసు జనరల్ హాస్పిటల్ నందుండు రోగులకు మారేడును వాడి నివేదికయందు యిట్లు వ్రాసిరి.—

"ముఖ్యముగ బిడ్డలకు కలుగు గ్రహణికి అతిసార వ్యాధులకు, బిల్వఫల అవలేహ్యమును వాడిన మీాదట మంచి గుణము కలిగినది."

# బిల్వ కల్కములు.

—:o:—

గ్రహణి రోగమునకు:—

శ్రీఫల శలాటు కల్కో సాగర చూర్ణేన మిశ్రితస్సగుడః ।
గ్రహణీగద మత్యుగ్రం తక్రభుజాతు శీలితో జయతి ॥

లేతమారేడు కాయను కల్కముజేసి అందు శొంఠి చూర్ణము బెల్లముచేర్చి పుచ్చుకొనిన ఉగ్రమగు గ్రహణి రోగము మానును. పథ్యము మజ్జిగన్న మిడవలయును.

—వైద్యచింతామణి.

ప్రవాహికయందు:—

కల్కస్స్యాద్బాల బిల్వానాం తిల కల్కశ్చతత్సమః ।
దధ్నస్సారోంమ్ల స్నేహాఢ్యోహన్త్యాద్వ్ర తత్ప్ర వాహికాం॥

లేతమారేడుకాయలను కల్కముజేసి తిల కల్కము సమముగచేర్చి పెరుగుమీాదితేట, పులుసు వస్తువులు స్నేహ ద్రవ్యములుచేర్చి పుచ్చుకొనిన ప్రవాహి కాతిసారముమానును.

—వైద్యచింతామణి.



# బిల్వాది కషాయములు.

—:o:—

వాంతులకు.—

బిల్వత్వచోగుడూచ్యావా క్వాథః క్షౌద్రేణ సంయుతః।
జయేత్త్రి దోషజంఛర్దింపర్పటః పిత్తజంతథా॥

మారేడుపట్టనేని, తిప్పతీగెనేని, కషాయము గాచి అందు తేనె గలిపి సేవించిన వాతపిత్త శ్లేష్మముల వలన గలిగిన వాంతులును, పర్పాటక కషాయములో తేనె గలిపి సేవించిన పిత్తమువలన జనించిన వాంతులను హరించును.

—శార్ఙ్గధర.

మేదోరోగములకు.—

బిల్వోగ్ని మంథస్స్యోనాకః కాశ్మరీ పాటలాతథా।
క్వాథ ఏషాంజయేన్మేదోదోషం క్షౌద్రేణసంయుతః॥

మారేడువేళ్లు, కూరనెల్లివేళ్లు, దుందిలపువేళ్లు, గ్రుమ్ముడువేళ్లు, పాదిరివేళ్లు, వీనిని కషాయముగా గాచి యందు తేనెగలిపి సేవించిన శరీరమున మేదోవృద్ధిచే జనించు మేదోరోగము నశించును.

—శార్ఙ్గధర.



ఛర్ది, విషూచియందు:—

బిల్వనాగరనిః క్వాథోహన్యాచ్ఛర్దిం విషూచికాం।
బిల్వనాగరకైడర్య క్వాథస్స్యా దధికోగుణైః॥

బిల్వఫలము శొంఠి వీటిని కషాయముబెట్టి సేవించినను లేక బిల్వము, శొంఠి, కాయఫలము వీటిని కషాయముబెట్టి సేవించిన ఛర్ది విషూచి నివర్తించును.

—వైద్యచింతామణి.

పిత్తాతిసారమునకు:—

బిల్వశక్రయవాంభోదవాలు కాతి విషాకృతః।
కషాయోహంత్యతీసారం సామంపిత్త సముద్భవం॥

బిల్వఫలము, కొడిశపాల, తుంగముస్తెలు, కురువేరు, అతివస ఇవిసమముగ కషాయముబెట్టి పుచ్చుకొనిన పిత్తాతిసారము నివర్తించును.

—వైద్య చింతామణి.

బిడ్డలకు కలుగు గ్రహణి రోగమునకు బిల్వఫలం, గజపిప్పలి, బలామూలం, ధాతకీపుష్పము, లొద్దుగపట్ట వీటిని కషాయ రూపమున గాని అవలేహ్యరూపముగగానియిచ్చిన నెమ్మదించునని వీరేచెప్పి

అతిసారములకు:—

అతిసారములకు బిల్వమూలకషాయమున వేచిన బియ్యమును, చక్కెరను కలిపి, పక్వముచేసి సేవించిన మేలు కలుగును.

# బిల్వ తైలములు.

—:o:—

బధిర రోగములకు:—

బాల బిల్వాని గోమూత్రే పిష్ట్వా తైలం విపాదయేత్ ।
సాజక్షీరంచ నీరంచ భాదిర్యే కర్ణపూరణాత్ ॥

మారేడుపిందెలను గోమూత్రముతో నూరి కల్కము చేసి అందు నాలుగింతలు నువ్వులనూనె నూనెకు నాలుగింతలు మేకపాలు కల్కము చక్కగ పాకమగుటకై నూనెకు నాలుగింతలు నీళ్లుబోసి తైలపక్వముగ కాచి వడియగట్టి చెవిలోబోసిన చెవుడు నశించును.

—శార్ఙ్గధర.

గుల్మాదిరోగములకు:—

బిల్వం రాస్నాంయవాన్ కోలం దేవదారుంపునర్నవాం ।
కులుత్థాన్ పంచమూలం చపక్త్వా తస్మిన్ పచేజ్జలే ।
తైలం తన్నావనే పానే వస్తౌచ వినియోజయేత్ ॥

మారేడుపండు, దుంపరాష్ట్రము, యవలు, రేగుపండు, దేవదారుచెక్క, గలిజేరు, ఉలవలు, పంచమూలములు వీటిని సమభాగములుగ ఉదకములో వైచి చక్కగ కాచి అందులో



నువ్వులనూనెపోసి తైలపాకవిధిగ పక్వముచేసి దానిని నస్యము పానము అనువాసనవస్తి వీటియందుపయోగించు కొనిన గుల్మము, ఆనాహవాతము మొదలగునవి హరించును.

—అష్టాంగహృదయము.

గ్రహణ్యాదులకు:—

తులాంసంక్షిప్య బిల్వస్యపచే త్పాదావశేషితం ।
సక్షీరంసాధయేత్తైలం శ్లక్ష్ణపిష్టైరిమైస్సమైః ।
బిల్వంచధాతకీకుష్ఠం శుంఠీరాస్నాపునర్నవా ।
దేవదారువచాముస్తా లోధ్ర మోచరసాన్వితం ।
ఏతన్మృద్వగ్నినాపక్వం గ్రహణ్యార్శోలిసారనుత్ ।
బిల్వతైల మితిఖ్యాతమత్రిపుత్రేణభాషితం ।
గ్రహణ్యర్శోతి సారేచస్నేహత్త ముపదర్శితాః ।
ప్రయోజ్యాస్తేతి సారేపిత్రయాణాంతుల్య హేతునా ॥

100 పలముల బిల్వఫలములు, 400 పలముల నీళ్లయందునిచి 4-వ భాగము మిగులునటుల కషాయముకాచి, అందు పాలు, నూనె చేర్చి పిదప బిల్వఫలము, ఆరెపువ్వు, కోష్ఠము, శొంఠి, రాస్న, తెల్లగలిజేరు, దేవదారు, వస, తుంగముస్తలు, లొద్దుగ, బూరుగుబంక వీటిని సమముగ చూర్ణించిచేర్చి తైలపక్వముగ చిరుమంటచే కాచి అభ్యంజనమొనర్చిన గ్రహణి, అర్శస్సు, అతిసారము వీటిని నశింపజేయును. ఇది అత్రికుమారునిచే చెప్పబడిన బిల్వతైలము.

—వైద్యచింతామణి.

ప్లీహోదరమందు:—

బిల్వం పాఠాభయాధాన్యం యవానీ సైంధవం బిడం ।
పంచకోలం సమరిచం క్షారౌ శ్చై భిర్ఘృతంపచేత్ ।
దధ్నా చతుర్గుణే నైవ శకృద్వాత విబంధనుత్ ।
సర్వామప్లీహ వాతార్తిగుదభ్రంశరుజాపహం ॥

మారేడు, విషబొద్ది, కరకకాయలు, ధనియాలు, ఓమము, సైంధవ లవణము, బిడా లవణము, పిప్పళ్లు, పిప్పలీ మూలము, చవ్యము, చిత్రమూలము, శొంఠి, మిరియములు, యవక్షారము, సర్జక్షారము వీనిని సమభాగములుగా చేసి, వీని కంటె నాలుగింతలు నేయిపోసి, నేతికంటె నాలుగింతలు పెరుగుపోసి, పచనముగావించి సేవించిన మలబంధము, అపాన వాయుబంధము, ఆమరోగములు, ప్లీహోదరము, వాత రోగము గుదభ్రంశము వీనిహరించును.

—గదనిగ్రహం.

గ్రహణ్యాదులయందు:—

బిల్వాగ్ని చవ్యార్ద్రిక శృంగిబేర క్వాథేన కల్కేనచ సిద్ధమాజ్యం ।
సచ్ఛాగ దుగ్ధం గ్రహణీగదోత్థం శోథాగ్నిసాదా రుచి నుద్వరిష్టం ॥

మారేడుగుజ్జు, చిత్రమూలము, చవ్యము, శొంఠి, అల్లము వీటిని సమభాగములుగ గ్రహించి 4 వ భాగము మిగులునటుల కషాయముకాచి వడియగట్టి యీ కషాయమునకు సమము ప్రత్యేకము ఆవునెయ్యి మేకపాలుచేర్చి



పిమ్మట అందులో మారేడుగుజ్జు మొదలగువాటి కల్కములను కలిపి పాకముజేసి సేవించిన గ్రహణిరోగము, వాపు, అగ్నిమాంద్యము, అరుచి హరించును.

—భైషజ్యరత్నాకరం.

గ్రహణి అతిసారాదులకు:—

ఎండిన బిల్వఫలము $12\frac{1}{2}$ శేర్లు, జలము 64 శేర్లు కలిపి నాలవభాగము మిగులునటుల కషాయమును కాచి వడియ గట్టవలయును. వడియగట్టిన కషాయములో నాలుగు శేర్లు నువ్వులనూనెను పోసి సన్నరాష్ట్రము, తెల్లగలిజేరు, కోష్టం, శొంఠి, మారేడుగుజురు, ఆరెపువ్వు, దేవదారు, లొద్దుగపట్ట ఆరు తులములను తీసుకొని కల్కము చేసిపైకషాయమున కలిపి తైల పక్వముగ కాచి వాడవలయును. గ్రహణి అతి సారాది వ్యాధిగ్రస్థులకు యీతైలస్నానము మేలుచేయును.

# బిల్వాది లేహ్యములు.

—:o:—

సర్వాఛర్దులకు:—

త్రింశత్పలం బిల్వ మూలమర్ధ కుంభాంభసాపచేత్।
అష్టభాగావ శేషేస్మిన్ కషాయ మవతారయేత్।
త్రింశత్పలం గుడందత్వా కించిత్పక్వంచ కారయేత్।
త్రిపలం శృంగిబేరస్య మరీచస్య చతుష్పలం।
పిప్పల్యాః కుడవార్ధంచ చవికాయాః ప్రకుంచకం।
ముష్టిం తాళీసపత్రస్య ముష్ట్యర్ధం కేసరస్యచ।
ద్విపలంపిప్పలీమూలం చిత్రకస్య పలంతథా।
పృధక్త్రి జాతకంచైవ కర్షం జీరపలద్వయం।
చూర్ణం తస్మిన్ వినిక్షిప్య యుక్త్వాపుష్ప రిసంక్షిపేత్।
ఏతద్బిల్వాదికం లేహ్యం సర్వఛర్ధి నివారణం।
హృద్రోగ కామిలాగుల్మ గ్రహణ్య రుచిపీనసం।
హిక్కాకాస క్రిమిశ్వాస ప్లీహానాహగరామయాన్।
అర్శాంసి పాండు రోగంచ హన్యాత్కాలే నిషేవితః॥

ముప్పది పలములు మారేడువేళ్లను చిదియగొట్టి ఒక భాండములోవైచి తూమెడు నీళ్లుబోసి 8-వ భాగముగ కషాయముకాచి అందు బెల్లము 30 పలములు కలిపి చిక్కగ కాచి పిదప అందు శొంఠిచూర్ణము 3 పలములు మిరియాల చూర్ణము 4 పలములు, పిప్పలి చూర్ణము 2 పలములు, చెవ్యపు చూర్ణము 1 పలము, తాళిసపత్ర చూర్ణము 1 పలము, నాగకేసరముల చూర్ణము ½ పలము, మోడిచూర్ణము 2 పలములు



చిత్రమూల చూర్ణము 1 పలము, ఏలకుల చూర్ణము 1 పలము, లవంగపుచెక్క చూర్ణము 1 పలము, ఆకుపత్రి చూర్ణము 1 పలము, జీలకర్ర చూర్ణము 2 పలములు వైచి బాగుగ కలిపి యధోక్తకాలమున సేవింపుచుండిన సర్వాఛర్దులు, హృద్రోగము, కామిల, గుల్మము, గ్రహణి, అరుచి, పీనసము, ఎక్కిళ్లు, కాసము, క్రిమిరోగము, శ్వాసము, ప్లీహరోగము, కడుపుబ్బరము, విషదోషము, మూలరోగము, పాండువు హరించును.

బసవరాజీయం.

సర్వాఛర్దులకు (లఘు)

బిల్వార్ధాఢక మంభసోర్ధక లశేపక్త్వా చతుర్ధాంశకం।
తస్మిన్ జీర్ణగుడంచ షోడశపలిం మిశ్రీకృతం చూర్ణితం।
కర్షాంశంఘన ధాన్యజీరక తృటిత్వ క్కేసరత్ర్యూషణం।
పీఢంఛర్ద్య రుచిప్రసేకశమనం శ్వాసాగ్నిమాంద్యం జయేత్॥

32 పలములు మారేడువేళ్లను దంచి, తూమెడు నీళ్లుబోసి, నాలవభాగముగ కషాయముకాచి అందు ప్రాతబెల్లము 16 పలములు కలిపి, లేహ్యపక్వముగ కాచి, అందు తుంగముస్తలు, కొతిమర్లు, జీలకర్ర, ఏలకులు, దాల్చినచెక్క, నాగకేసరములు, త్రికటుకములు అనువాని చూర్ణమును దినుసుకు 1 పలముచొప్పున వైచి బాగుగ కలియబెట్టి సేవించిన అన్ని వాంతులు, అరుచి, ఎల్లప్పుడు నోటనీరుగారుట, శ్వాసము, అగ్నిమాంద్యము హరించును. బసవరాజీయం.

# శాస్త్రవిషయసంగ్రహము

బిల్వ :—

శ్రీఫలః ప్రవరస్తిక్తో గ్రాహిరూక్షోగ్ని పిత్తకృత్।
బాలశ్లేష్మహరో బల్యోలఘురుష్ణశ్చ పాచనః।
భావప్రకాశేతస్య గుణాః॥

బిల్వం బాలం కషాయోష్ణం పాచనం వహ్నిదీపనం।
సంగ్రాహితిక్తకటుకంతీక్ష్ణం వాతకఫాపహం॥
పక్వంసుగంధి మధురందుర్జరం గ్రాహిదోషలం।
ఫలేషు పరిపక్వేషు యోగుణః సమూదాహృతః॥
బిల్వాదన్యత్రసంజ్ఞేయః బిల్వమామం గుణోత్తరం। కఫ
వాతాన్న పిత్తఘ్నే గ్రాహిణీ బిల్వపేషికా॥ ఇతిరాజవల్లభః
కాంచికే సంస్థితం బిల్వం అగ్నిసందీపనం పరం

ఇతివైద్యకం॥

తద్వృక్షు ఉత్పత్త్యాధి; యథా భృగోర్లక్ష్మీశ్చయా ధేనుః
గోరూపసాగతామహీం తద్గోమయభవో బిల్వః శ్రీయశ్చ
తస్మాదజాయత॥ బిల్వవృక్షః ప్రియఃశంభోః తవయోనిర్భ



విష్యతి। సర్వపుష్పోత్తమఃశ్రేష్ఠః దేవహారో మనోరమః॥
అచ్ఛేద్యః సర్వలోకానాం ఛేదాన్నాశః సదానృణాం।
ఏచపాపాదురాచారాః శ్రీతరోశ్ఛేద కారిణః॥
తేత్వవీచ్యాదినరకే పాత్యంతే బ్రహ్మణోదినం। సుదుఃఖితా
భవిష్యంతి నరా దుష్కులినస్సదా॥
తత్రదేశే భయంనిత్యం చిరం రాజా నజీవతి।
నచద్రవ్యపతిః కశ్చిత్ బిల్వవృక్షస్య ఛేదకః।
క్రియంతే యత్రవిచ్ఛేదః సపుష్పఫలినస్తరోః।
అనావృష్టి భయంఘోరం తస్మిన్దేశేప్రజాయతే॥

ఇతిఅగ్నిపురాణే

బృహద్ధర్మపురాణే-అస్యఉత్పత్తిః-అన్యథాఉక్తా. సాతు-
లక్ష్మ్యా శివారాధనార్థం స్వైకస్తనస్య ఉత్పాటనే
కృతే తుష్టేన శివేన లక్ష్మీం ప్రత్యుక్తంయథా॥
మాతఃసముద్రతనయే మామాచ్ఛింధిస్తనం పరం। యస్తే
చ్ఛిన్నః స్తనోవామః జాయతాం పునరేవసః॥
జ్ఞాతాతేవరమాభక్తిః పూర్ణస్తే మనోరథః। యశ్చభిన్నః
స్తనోభక్త్యా మల్లింగో పరితేశుభే। సోస్తువృక్షక్షితౌ
పుణ్యోనామ్నాశ్రీఫల ఇత్యతః। మూర్తిమాంస్తవవైభక్తిః

వృక్షశ్రీఫలనామకః। త్వత్కీర్తయే క్షితావాస్తాం యావ
చ్చంద్ర దివాకరౌ। సతరుర్మమలై లక్ష్మీశ్చ పరమస్సు
క్రియోభవేత్। తత్పత్రేణైవమేపూజా భవిష్యతి నచా
న్యథా॥ స్వర్ణముక్తా ప్రవాళాది పుష్పాణ్యనాచిద్ధ్రువం।
శ్రీఫలచ్ఛదలేశస్య కలాం నార్హంతి కోటికాం। యథామే
శ్రీఫలతరుః యథా గంగాజలంమమ। తథాప్రియతమం
లక్ష్మి త్రిపత్రః శ్రీపలచ్ఛదః॥ తత్రైవ-

ధనుఃశతంచాస్య మూలాత్। ఖంజాగ్రం తీర్థముచ్యతే।
అధోభూమేస్తథాతీర్థం అతస్తీర్థత్రయం సఖి। ఊర్ధ్వపత్రం
హరోజ్ఞేయం పత్రంవామం విధిస్స్వయం। అహం దక్షిణ
పత్రంచ త్రిపత్రదళమిత్యుత। అస్యఛ్ఛాయాంచ పత్రంచ
లంఘయేన్నపదాస్పృశేత్॥ హారంతేలంఘనాదాయుః।
పదాస్పర్శాత్ శ్రియంహరేత్॥

ఇత్యాదినాతన్మాహాత్మ్యం

ఉక్త్వా తత్పత్రహరణం విధానాదితత్రోక్తం యథా॥
పక్షాంత ద్వాదశీ సాయం మధ్యాహ్నేభిన్న కాలతః-శాఖా।
భంగోనకర్తవ్యః నైవారోహేత్తథాతరుం।



వరమారుహ్య ఛినుయాత్ నశాఖాభంజనం క్వచిత్
ఖండితైశ్చశివః పూజ్యః పత్రైరన్యైశ్చ ఖండితైః। షణ్మా
సానంతరం బిల్వపత్రంపర్యుషితంభవేత్। పూజ్యతేనవైః।
సూర్యలంబోదరావినా దేవాః। బిల్వవృక్షవనం యత్రసాతు
వారణసీపురంపంచ బిల్వద్రుమా యత్ర తత్రతిష్ఠేత్
స్వయంహరిః॥ సప్త బిల్వద్రుమా యత్ర తత్రదుర్గాయు
మోహరః। ఏకోబిల్వ తహుర్యత్రతత్ర శంభుర్మయాసహ।
బిల్వవృక్షా యత్రదశ తత్ర శంభుగణైస్సహ।
ఏతాన్యుక్తాని తీర్థాని దేవాః సర్వేమరుద్గణైః।
యత్రవాట్యాంగ్రహస్థస్యరోణ అనుశాళనామకే। జాయతే
శ్రీఫలతరుః నతత్రవిపదః క్వచిత్।

పూర్వస్యాంసుఖదః సఃస్యాత్ దక్షిణేయమభీతిహా। పశ్చి
మేచ ప్రజాదాయీ వృక్షో బిల్వ ఉదాహృతః। స్మశానేచ
నదీతీరే ప్రాంతరేవా వనాంతరే।బిల్వవృక్షతలం ప్రోక్తం
సిద్ధపీఠతలంసమం। నమధ్యప్రాంగణే వృక్షంస్థాపయేత్।
శ్రీఫలాఖ్యకం దైవాద్యది ప్రజాయేత। తదాశివవమర్చ
యేత్॥

చైత్రాది చతురో మాసాన్ శంభవే పరమాత్మనే। దత్తం స్యాత్। బిల్వపత్రైస్త్రికం లక్షధేను సమం సురాః మధ్యాహ్న కాలే ఏ మర్త్యాః బిల్వం కుర్యుః ప్రదక్షిణం త్రైః సుమేరు ర్గిరివరః క్రాంత ఏవ ప్రదక్షిణం। నచ్ఛింద్యాత్ శ్రీఫలతరుం నదహేత్కాష్ఠమేవచ। వినా బ్రాహ్మణయజ్ఞార్థం పతితో బిల్వ విక్రయీ। పక్వబిల్వ సముత్కృష్టం యో ధత్తే మూర్ధ్ని మానవః। యమాధికారో నాత్రస్యాత్ హృతః పాపఉప పాతకైః। బిల్వపత్రం ఫలం బీజం భూమౌ పతిత మీశ్వరః। స్వయం స్పృష్ట్వా శిరసా వై యద్ధ్యభయం శంకితః। చైత్రాది చతురో మాసాన్ శించేత్ బిల్వ తరుం కృతీ। యథాస్నిగ్ధో భవేద్వృక్షః తథాతత్పితరోపిచ। చైత్రాది చతురా మాసాన్ సదా భ్రమతి శంకరః। నవీన బిల్వ పత్రార్థీ భుక్తిముక్తి ప్రదాయకః। హరిద్రానగరే యత్రవైద్య నాథో మహేశ్వరః। తత్రాక్ష యో బిల్వవృక్షః స్వర్గ వృక్ష ఉదాహృతః। కామరూపే కామతరుః కాశ్యాం ముక్త స్తథాదిమః । కాంచీపురే పురః ప్రోక్తః శ్రీఫలాక్షయ పుణ్యదః। తేపితీర్థ విశేషాస్యు తీర్థేష్వపి సదాతులాః। తత్ఫలైస్తత్ప్రసూనైర్వా తత్పత్రైర్యః। ప్రపూజ యేత్తత్కాష్ఠచందనైర్వాపి సమే భక్తస్స మే ప్రియః॥



తత్కాష్ఠచందనం పాలా యో ధారయతి సంభ్రమాత్। తత్తనుం శివబుధ్యాసాన మేద్దేవి ముదాన్వితా। అతస్తచ్చం దనం దేవీ నధారయతి కశ్చన తత్పత్రం తత్ప్రసూనం వా కదాపి ధారయేన్నహితాస్య మూలే మహేశాన్ ప్రాణోస్త్య జతియో నరః రుద్రదేహః భవేత్సత్యం పాప కోటియుతోపిసన్॥ ఇతియోగినితంత్రపటలే బిల్వం వృక్షంతథా దేవీ భగవాన్ శంకరస్స్వయం బిల్వవృక్షతలే స్థిత్వా యది ప్రాణం త్యజేస్సుధీః తత్క్షణా న్మోక్షమాప్నోతి. కింతస్య తీర్థకోటిభిః యత్ర బ్రహ్మాదయో దేవాః తిష్ఠంతి ముక్తిహేతవే బిల్వవృక్షతలై స్థానం యదివిష్ఠాదిపూ రితం తదేవ శంకరం క్షేత్రం సర్వతీర్థమయం సదా। సర్వపీఠ మయం తత్తు సర్వదేవమయం సదా। నత్యజేత్ శంకరం క్షేత్రం నచ గంగాం త్యజేత్ ప్రియే। సమీపే సచ చార్వంగి బిల్వ వృక్షయది ప్రియే। కటీం పురసమం తత్తు తత్ర ప్రాణాన్ త్యజే త్యది। కింతస్య కోటి తీర్థేన కాసివాసేన కిం ప్రియే॥

తద్దానవిధిర్యథా:—

పత్రం వా యదివా పుష్పం ఫలం నేష్టమధోముఖం యతో త్పన్నం తథా దేయం బిల్వపత్రాణ్యధోముఖం॥

శివఉవాచ:—

శృణు దేవిప్ర!। వక్ష్యామిరహస్యం త్రిజటాత్మకం పత్రం బ్రహ్మమయం దేవీ అద్భుతం వరవర్ణినీ। శ్రీశైల శిఖరేజాతః శ్రీఫలః శ్రీనికేతనః। విష్ణుః ప్రీతికరశ్చైవ మమప్రీతికరస్సదా। బ్రహ్మవిష్ణుశివాః పత్రేవృతంచ శక్తిరూపకం। వృతేమూలేతు వజ్రంస్యాత్ పత్రేబ్రహ్మపదం ప్రియే। త్రిజటాపత్రకైకేన హరంవా హరిమర్చయేత్॥ కైవల్యంతస్యతేనైవ శక్తి పూజా విశేషతః। పత్రం పుష్పం ఫలం తోయం నైవేద్యం ధూప దీపకం। దత్వాదద్యాత్ ఫలంప్రాప్తం తస్మాత్కోటి గుణంభవేత్ ।సర్వైరర్చనతో దేవీ త్రిజటాత్మసమర్పణం కైవల్యదా హరిశ్చైవ దాస్యేహంత్వత్స్వరూపతాం।త్వయి కైవల్యదం జ్ఞానం ధర్మకామార్థదంప్రియే। వజ్రహీన మిదందేవి ప్రాప్నుయా ద్వాంఛితంఫలం। సవాజ్రేమియ తేనూనంవజ్రాఘాతేనపార్వతీ। తస్మాచ్ఛసా కేంద్రేణ వజ్ర హీనం ప్రదీయతే। బాణంగృహిత్వాయో గచ్ఛేత్ సర్వ సిద్ధ మవాప్నుయాత్॥ ఊర్ధ్వంసుదర్శనం రక్షేదథః పశు పతిస్తథా। పురో మాహేశ్వరీ రక్షేత్పృష్ఠేచ శూలధారిణీ। దక్షిపార్శ్వేచ శ్రీనాథః వామపార్శ్వే ప్రజాపతిః। చంద్ర సూర్యౌ ధృతంఛత్రమహం వామకరాసదా॥



జ్ఞానభైరవతంత్రే

విష్ణవేపత్ర విశేషదానఫలం యథా నారసింహే 52

పత్రాణ్యపిసపుష్పాణిహరేః ప్రీతికరాణిచ। వీక్ష్యాప్రమి నృపశ్రేష్ఠశృణుష్వగదతోమమ। అపామార్గ పత్రంప్రథమం తస్మా ద్భృంగారకంపరం। తస్మాత్తు ఖాదితం శ్రేష్ఠత తశ్చశమి। పత్రకం దూర్వాపత్రంత త్శ్రేష్ఠతా=విఘశ పత్రకం పత్రంతస్మాద్ద మనకంతతో బిల్వాన్యపత్రకం బిల్వపత్రాదపిహరైః తులసీపత్ర ముత్తమం

ఏతేషాంచయథాలబ్ధైః పత్త్రైర్యోఽర్చయేద్ధరిం సర్వ పాప వినిర్ముక్తో విష్ణు లోకేమహీయతే।

దేవీప్రీతికరపత్రాణి యథా అపామార్గస్యపత్రంతుతతో భృంగార పత్రకం।

తతోపిగంధినీ పత్రంవలాహక మతః పరం। తస్మాత్ఖదిర పత్రం తువంజుళ స్తవక స్తథా।

ఆమ్రంతునకగుచ్ఛస్తుజంబూపత్రంతతఃపరంబీజపూరస్యం పత్రంతుతతోపి కుశపత్రకదూర్వాంకురం తతఃప్రోక్తం శమీపత్రమతఃపరంపత్రమామలకం తస్మాద్దానుపత్రమత। పరం। సర్వతో బిల్వ పత్రంతం దేవ్యాః ప్రీతికరం మతం.

ఇతి కాలకాపురాణే 68

# వివిధ విషయములు

## మారేడు, వెలగ

ఎండబెట్టిన మారేడుఫలములు దుకాణములయం దమ్మబడుటయు అవసరమున్నవారు వాటినికొనుటయు మామూలైయున్నది. ఇట్టియెడనున కొంతమంది దుకాణదారులు యెండబెట్టిన వెలగగుజురును మారేడుగుజురనిచెప్పి మోసగించుచున్నారు. మారేడుగుజురను పేర యొసగబడు వెలగగుజురు నుపయోగించుటవలన వలయుగుణముండదు. కనుక యెండిన మారేడును కొనువారు కొంతశ్రద్ధగా పదార్థ పరిశీలన మొనరింపవలయును. ఈక్రింది వివరములవలనమారేడు వెలగల గుజురులను గుర్తింపవచ్చును.

### మారేడు—

సాధారణముగ మారేడు, కోడిగ్రుడ్డు ఆకృతిగనుండును. పెద్దమారేడు గుండ్రముగనుండును. కొన్ని ఫలములు చంటిబిడ్డ శిరమంతకూడనుండును. వర్ణము ఆకు



పచ్చగగాని, కొంచెము పసుపువన్నెగాగాని యుండును. పైభాగము నున్ననై కొంచెముమెరుగు గలిగియుండును. పై పెంకు గట్టిగనుండి పలచగనుండును.

ఫలముయొక్క మధ్యభాగమున నొకవిధమగు జిగురుతోనిండియున్న రంధ్రములుండును. ఆప్రాంతముననే పదిలేక పన్నెండు విత్తనములుకూడ నుండును. (చిన్నరకము మారేడునందీమధ్యప్రాంతమున గింజలు కొన్నింటిలో ఉండనేయుండవు.)

మారేడు విత్తనములు కొంచెము చదరమై అణగిపైన ఊలువలె మెత్తనై నిమ్మగింజలంత యుండును. ఇందలి జిగురు పట్టిన వదలనిదై నిర్మలమై ఒకవిధమగు పరిమళమును గలిగియుండును.

బాగుగ పండిన మారేడు గుజురు యెరుపువన్నెగల బూడిద వర్ణమునుగాని కొంచెము యెరుపురంగుగల పసుపు వన్నెనుగాని గలిగియుండును.

### వెలగపండు.—

వెలగ గుండ్రని ఆకారమును గలిగియుండును. సాధారణముగ నారింజ తీరున పెద్దదాడిమ ప్రమాణమున నుండును.

పైపెంకు తెలుపుచాయగల ఆకుపచ్చరంగు గలిగి యుండును. కొన్ని బూడెదవర్ణమును గలిగియుండును. పెంకు మెరుగుగాని మృదుత్వమునుగాని లేకయుండును.

పెంకు కర్రవలెనుండి దళసరిగనున్నను త్వరలో విరువవచ్చును.

ఇందు జిగురున కాకరమగు పదార్థములేదు. కాయ యొక్క అన్ని ప్రాంతములయందును గింజలు విరివిగ నుండును. ఒకకాయలో సుమారు 500 ల గింజలుండును.

వెలగ గింజలు మారేడుగింజల ఆకృతినే యుండునుగాని పరిమాణములోమాత్రము చిన్నవై యుండును. ఇందు జిగురు పదార్థము లేదుగాని పుల్లగనుండును. ఫలములోని గుజురు మారేడుగుజురువలెనే యుండును కాని ఒకవిధమగు చక్కని పరిమళమును గలిగి కొంచెము పులుపు రుచిని గలిగియుండును.

## మారేడు—మోక్షసాధనము

—:o:—

మారేడు అనేక వ్యాధులఁ గుదుర్చుటయేగాక నాకలోక వైభవప్రదంబు కూడనని పురాణప్రసిద్ధమైయున్నది. కొందఱు ఈశ్వరోపాసకులీ బిల్వపత్రమునే పరమేశ్వర స్వరూపముగ భావించి శిరమునధరించుకొని యానందింతురు. కొందఱా వృక్షమును గాంచినంతనే సాగిలఁబడి మ్రొక్కుదురు. రాజమార్గనిరోధక మైననుసరే మారేడువృక్షమును నఱకుటకు వైద్యు లంగీకరింపరు. దీనికంతకును గారణము లేకపోలేదు. మోక్షదాయినియగు మారేడునుగుఱించి గోదావరిజిల్లాయందున్న వ్యాఘ్రేశ్వరమను గ్రామముననొక ప్రసిద్ధవదంతి యున్నది. పూర్వమొక ఈశ్వరార్చకుఁడచట నుపాసన సల్పుచుండ పులియొకటాతనిని జంపవచ్చెననియు, తత్కాల మృత్యువాతనుండి విముక్తుఁడగుటకు నా శివభక్తుఁడా బిల్వవృక్షము నారోహించెననియు, చిరకాల మావృక్షమూలమునఁ గాచియుండి తుదకాతనిఁ జంపలేక ఆచెట్టుక్రిందనే యీవ్యాఘ్రము మసువులు వీడెననియు, బిల్వవృక్షముక్రిందఁ జని

పోయిన యీవ్యాఘ్రమొక విగ్రహముగ మాఱెననియు, పవిత్రమగు నీవృత్తాంతము బిల్వవృక్ష మహిమాన్వితమైన దగుటచే భగవత్స్వరూపమనియు విశ్వసించి ప్రజలావిగ్రహమును, తన్మూలమున బిల్వప్రశస్తిని పూజించుచున్నారు.

ఈవృక్ష మింటి కుత్తరపు భాగమునదక్క నేవైపున నున్నను గృహస్థు లమితవైభవము నందుదురని శాస్త్ర ప్రబోధమున్నది.

దీని బెరడును పసుపురంగుకు, కలికారంగుకు కరక్కాయతోఁ జేర్చియు నుపయోగింతురు. దీని వేళ్లరసమును తేలు, పాము కాట్లయందు రాచినచో విషము హరించును. దీని గింజలయందున్న జిగురుతో సున్నముఁ గలిపినయెడల మఱియు బలమగు జిగురు తయారగుననియు తన్మూలమున బద్దలయిన గాజుసామాను లతుకవచ్చుననియు ననుభవము మీఁదఁ గనిపెట్టి విక్రయించుచున్నారు.

# గృహలక్ష్మి

## స్త్రీల సచిత్ర మాస పత్రిక

"గృహలక్ష్మి" యనుపేర నొక సచిత్రమాస పత్రికను ఆంధ్రయువతీమణుల అభ్యున్నతికై 1928-వ సంవత్సరము మార్చి నెల నుండి వెలువరించుచున్నాము. ఇందు ముఖ్యముగ రమణీమణుల ఆయురారోగ్యములను పెంపొందించు విషయములు చర్చింపబడును. స్త్రీలు సర్వవిషయములందును పురుషులతో సమాన వ్యక్తులని నిరూపించుటయె మాయుద్దేశము. స్త్రీలు ఆత్మ సంఘోన్నతికి విశ్వ ప్రయత్నములను చేయుచున్న ఈ దినములలో గృహలక్ష్మివంటి పత్రిక అత్యంతావశ్యకమైనది. ప్రతి మాసపు సంచికయందును స్త్రీల జీవన మార్గమును బాగుచేయు వ్యాసములు, నీతిని బోధించుకథలు, ఉత్తేజము పుట్టించు పద్యములు, ఉన్నతాదర్శముల రేపు ఉత్తమ స్త్రీరత్నముల చరిత్రలు—వేయేల స్త్రీలకు పనికివచ్చు సకల విషయములును నిండారియుండును. చిత్ర విచిత్రములగు పటములతో, మేలు కాగితములపై ముద్దులొలుకు చక్కని కూర్పుతో పత్రిక యెంతయు దర్శనీయమై యుండును. చదువ నేర్చిన ప్రతి ఆంధ్ర స్త్రీ హస్తముల యందును భూషణమై విలసిల్లగల పత్రికారాజము. అట్టి ఈ పత్రికకు చందాదారులుగ జేరియు వ్యాసముల వ్రాసియు మా ప్రయత్నమునకు పోషణ ప్రోత్సాహములు కల్గింప దేశసేవానిరతులగు సోదరసోదరీమణులను కోరుచున్నాము. స్త్రీల యభివృద్ధికి స్త్రీలే కొంత పడిశ్రమ బూని తోడ్పడిన, బంగారమునకు పరిమళ మిచ్చినట్లు గృహలక్ష్మి ప్రతి ఆంధ్ర గృహమునందును లక్ష్మియై విరాజిల్లగలదు.

సం॥ చందా రు. 4. — విడిసంచిక 6 అణాలు.

సంపాదకుడు

డాక్టర్. కె. ఎన్. కేసరి

గృహలక్ష్మి కార్యాలయము

పోస్టుబాక్సు 752 ఎగ్మూర్

మద్రాసు.

